నెహ్రూ బాల పుస్తకాలయం

# రోహంతుడు - నందియుడు

కృష్ణ చైతన్య

అనువాదం: వి. పాండురంగరావ్

బొమ్మలు: ప్రణబ్ చక్రవర్తి



ISBN 81 - 237 - 0434 - 8

ప్రథమ ముద్రణ 1972 (శక 1894)

తృతీయ ముద్రణ 1993 (శక 1914)



Rohant and Nandriya *(Telugu)*

రూ. 7.00

డైరక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్ పార్క్,
కొత్త ఢిల్లీ-110016 చే ప్రచురించబడినది.

మనందరికీ బుద్ధుడిని గురించి తెలుసు. ప్రపంచంలో ఎందరో జ్ఞానులు, కరుణా మూర్తులు అయిన ప్రవక్తలుదయిందారు. వారిలో బుద్ధుడొకడు. ఆయనను ప్రపంచమంతటా పూజిస్తారు.

బుద్ధుడు అన్నది పేరు కాదు; "జ్ఞానోదయం అయినవాడు" అని ఆ మాటకు అర్థం. జీవితం అంటే ఏమిటి? శాంతి సౌఖ్యాలతో వుండాలంటే మానవులు ఎట్లా జీవించాలి? ఇటువంటి విషయాల గురించి బాగా ఆలోచించి తెలుసుకున్నవాడు బుద్ధుడు. బుద్ధుడి అసలు పేరు సిద్ధార్థుడు. ఆయన ఒక యువరాజు. 2500 సంవత్సరాల క్రితం వుండేవాడు ఆయన.

ఒక నాటి రాత్రివేళ, ఆయన తన అంతఃపురాన్ని వదలి వెళ్ళిపోయాడు. ఎన్నో ఏళ్ళపాటు దేశమంతా సంచరించాడు. తన ఇల్లన్నా, తల్లిదండ్రులన్నా, భార్యా బిడ్డలన్నా ఆయనకు ఎంతో ప్రేమ వుండేది; మమకారం వుండేవి. కాని



తన చుట్టువున్న కష్టాలను, దుఃఖాన్ని చూచాక ఆయన వాటిని తొలగించడానికి ఒక దారి కనుగొనాలని అనుకున్నాడు. అందుకనే ఆయన తన వారందరనీ వదలి వెళ్ళిపోయాడు.

పువ్వులు పొద్దున్నే వికసిస్తాయి; వాటి మీద మంచు బొట్లు రత్నాల్లా మెరుస్తుంటాయి; కాని సాయంకాలానికి పువ్వులు వాడిపోతాయి. వసంతకాలం రాగానే చెట్లన్నీ చిగుర్చుతాయి; పుష్పిస్తాయి; కళకళలాడుతుంటాయి. వేసవి కాలం వస్తుంది; ఆకులు రాలేకాలం వస్తుంది. ఆకులన్నీ రాలిపోతాయి; చెట్లు మోడులుగా మిగులుతాయి. పిల్లలు పెరుగుతారు; యువతీ యువకులవుతారు. సుఖసంతోషాలతో జీవిస్తారు; చివరకు, ముదుసలులవుతారు; మరణిస్తారు.

ప్రాణం వున్న చోటనల్లా మరణం వుంటుంది. ఇది ఇంతే కాబోలు... కాని బ్రతికి వున్నంత కాలమయినా, మన మందరమూ హాయిగా తృప్తిగా, దయతో బ్రతకవచ్చు కదా? కాని మనుష్యులు అట్లా వుండలేక పోతున్నారు. అకారణంగా, వారు ఒకరినొకరు ద్వేషిస్తారు; కష్ట పెడతారు; అందరూ అసంతృప్తితో దుఃఖంతో వుంటారు. మనుషులు, ఇంత స్వార్థపరులుగా వుండకపోతే ఎంతో హాయిగా పరస్పరం ప్రేమతో వుండవచ్చు కదా! అప్పుడు ప్రపంచం ఆనందమయం అవుతుంది కదా!

మనుష్యుల స్వార్థం తగ్గించడానికి, వారిలో దయాగుణం పెంపొందించడానికి ఏదయినా మార్గం కనుక్కోవాలి - అని సిద్ధార్థుడు ఆశించాడు. భోగాలు, విలాసాలు నిండిన అంతఃపురం లోపలే వుంటే తాను తన ఆశయం సాధించలేనని అనుకున్నాడు ఆయన.

ఆ రాత్రి ఇల్లు విడిచి వెళ్ళే ముందుగా, సిద్ధార్థుడు పదే పదే తన భార్య వంక, ఆమె ప్రక్కనే నిద్రపోతున్న తన బిడ్డడి వంక చూచాడు. మల్లెలు మొదలయిన పువ్వులు చల్లిన మంచంమీద వాళ్ళిద్దరూ హాయిగా నిద్రపోతున్నారు. తన



కొడుకును వదలి వెళ్ళాలంటే సిద్ధార్థుడి మనస్సు కలుక్కుమంది. వాడిని తనతో పాటు తీసుకువెళ్ళకపోతే తాను వెళ్ళలేననిపించింది. కాని అంతనిద్రలోనూ బిడ్డ మీద చేయి వేసుకుని పడుకుని వుంది ఆ తల్లి. "ఇపుడు ఈమె చేయిని తీసివేయ డానికి ప్రయత్నిస్తే ఆమె మేల్కోవడం తథ్యం. ఆమె మేల్కొంటే నేను వెళ్లడం కల్ల. కనుక ఇపుడు వెళ్ళిపోతాను. నా సంచారాల ద్వారా మనుష్యుల దుఃఖాన్ని నిర్మూలించడానికి ఉపాయం కనుగొన్నాక, నేను మళ్ళీ వెనక్కు వస్తాను; నా కొడుకును చూస్తాను" అనుకుని, వెళ్ళిపోయాడు సిద్ధార్థుడు.

ఎన్నో ఏళ్ళపాటు తిరిగాడు; తపస్సు చేశాడు; చివరకు కోరినదానిని సాధించాడు. మనుష్యులు సుఖంగా శాంతితో జీవించడానికి మార్గం ఏదో, తాను ఇల్లు విడిచిన రాత్రే తెలిసినట్లు అనిపించింది. నిద్రలో సైతం బిడ్డను కాపాడుతున్న తల్లి చేతిని తాను చూశాడు గాని, దాని అర్థం తెలుసుకోలేక పోయాడు; దాని అర్థం ఇప్పుడు బోధపడింది. "తల్లి తన బిడ్డను సంరక్షించినట్లే, ప్రతిమనిషీ అన్ని ప్రాణులనూ ప్రేమించి సంరక్షించాలి! –" అనుకున్నాడాయన. ప్రతివ్యక్తి ఇతరులను, బిడ్డను తల్లివలె ప్రేమించగల్గితే ఈ ప్రపంచం ఆనందమయం అవుతుంది. ఈ జ్ఞానాన్ని పొందిన సిద్ధార్థుడు బుద్ధుడయ్యాడు. ఆయన అన్ని జీవరాసుల పట్ల కారుణ్యాన్ని ప్రదర్శించాడు. ఆయన చనిపోయిన తర్వాత కూడా జనులు బుద్ధుడి అపారమయిన కరుణను మరచిపోలేదు.



మంచి పనులు చేసిన వారందరూ స్వర్గానికి వెళ్తారనీ, అక్కడ కలకాలం సుఖంగా వుంటారనీ, అన్ని మతాలవారూ నమ్ముతుంటారు. కాని ఒక తరం తర్వాత ఇంకొక తరంగా మనుష్యులూ జంతువులూ పుడుతూ, కష్టాలు పడుతూ, బాధలను అనుభవిస్తూ వుండగా, బుద్ధుడికి స్వర్గంలో వుండబుద్ధి కాలేదట - అన్న నమ్మకం ఒకటి ఏర్పడింది. ఆ నమ్మకం మేరకు, ఆయన, మళ్ళీ మళ్ళీ జన్మలెత్తి ప్రాణికోటికి సాయం చేయసాగాడట; సిద్దార్థుడిగా పుట్టక పూర్వం కూడా ఆయన ఎన్నో జన్మలెత్తి, ఇట్లా సాయం చేశాడట. వేర్వేరు చోట్ల, వేర్వేరు రూపాలలో జన్మించి, ఆయన మానవులకూ జంతువులకూ, ఎట్లా తోడ్పడిందీ తెలిపే కథలు ప్రచారంలోకి వచ్చాయి. ఈ కథలను జాతక (పుట్టుక) కథలని అంటారు. ఆ రోజులలో మగధ (బీహార్) రాజ్యంలో "పాలి" భాష మాట్లాడేవారు. బౌద్ధ మతపు తొలి గ్రంథాలన్నిటినీ ఈ భాషలోనే రచించారు. ఈ జాతక కథలను కూడా, ఆ భాషలోనే రాశారు.

పాలిభాషలో 500 జాతక కథలున్నాయి. అవి అపూర్వమయిన సంపద వంటివి. ఆ కథలనింకా పొడిగించి, సంస్కృత భాషలో రాశారు. ఆ కథలు ఆధారంగా, అమరావతి, సాంచి, బహారూత్ వంటి బౌద్ధ క్షేత్రాలలో శిల్పులు, అందమైన శిల్పాలు చెక్కారు. అజంతా గుహల వంటి చోట్ల మనోహరమయిన రంగులలో చిత్రాలలో, చిత్రకారులు ఈ కథలను చెప్పారు.

ఆ జాతక కథలలో - రోహంతుడు - అన్న నల్ల జింక కథ, నందియుడు అన్న కోతి కథ వున్నాయి. ఆ రెండు కథలనూ ఇక్కడ పొందుపరుస్తున్నాము. ఆ కథలలో జింక, కోతులు చూపిన దయ, త్యాగము గురించి చదివిన తర్వాత, మీకు - కారుణ్యమూర్తి అయిన ఆ బుద్ధ భగవానుడే ఈ ప్రపంచాన్ని ఇంకా ఇంకా సుఖంతో, దయతో నింపడానికై, మళ్ళీ మళ్ళీ జన్మించాడని, అనిపించక మానదు.

# రోహంతుడి కథ

ఎన్నో వందల ఏళ్ళకు పూర్వం, ఉత్తర ప్రదేశ్‌లో ఒక అడవి దగ్గర మైదానంలో ఒక నల్లజింక పుట్టింది. ఆ జింక తల్లిదండ్రులు అతడికి రోహంతుడు అని పేరు పెట్టారు.

మీరెప్పుడయినా నల్లజింకను చూశారా? లేళ్ళన్నిటిలో అగి చాల అందమైనది. అది మనదేశపు అడవులలో మాత్రమే కనబడుతుంది. పెరిగి పెద్దదయిన మగజింక చర్మం నల్లగా నిగనిగలాడుతుంటుంది. వంకర తిరిగిన దాని కొమ్ములు గంభీరంగా వుంటాయి. ఆడజింక కాస్త చిన్నదిగా వుంటుంది. దానికి కొమ్ములుండవు; అది కూడ చూడ ముచ్చటగా వుంటుంది. పసుపు కలిసిన గోధుమ రంగులో వుంటుంది దాని చర్మం.

చిన్నప్పుడు రోహంతుడి చర్మము కూడా ఆ రంగులోనే వుండేది. మూడేళ్ళయ్యే సరికి అతడి చర్మం, నిగనిగ మెరిసే నల్లరంగుకు మారింది. ఇది గమనించి అతడి తల్లిదండ్రులు - అమ్మయ్య, మన వాడింక పెద్ద వాడయ్యాడు, తన్ను తాను కాపాడుకో గలడు - అని సంతోషించారు.

రోహంతుడూ, అతడి తల్లిదండ్రులూ వున్న జింకల గుంపులో దాదాపు వంద జింకలుండేవి. ప్రతి సంవత్సరమూ కొన్ని జింకలు చనిపోతుండేవి; కాని, పిల్లలు పుడుతుండేవి గనుక ఆ గుంపులో జింకల సంఖ్య అట్లాగే వుంటుండేది.



పొడుగాటి గడ్డి మొక్కల చాటున, తల్లి జింక, తడవకు ఒకటో రెండో చొప్పున పిల్లలను పెట్టేది. కొన్ని రోజులకు ఆ పసిజింకలు, పెరిగి బలం పుంజుకుని గుంపుతో బాటు తిరగసాగేవి.

రోహంతుడు పెరగ సాగాడు; అతడు తెలివి గలవాడుగా తయారైనాడు. అతిత్వరలో, తన గుంపు యొక్క పద్ధతులన్నీ అకళింపు చేసుకున్నాడు. ఆ జింకలన్నీ సాధారణంగా గడ్డిని మేసేవి. అప్పుడప్పుడు అడవి అంచుల్లో సాగు చేస్తున్న పొలాల్లోకి వెళ్లి మొక్కలను తిని వస్తుండేవి. బోలెడంత పచ్చి గడ్డి వున్న అడవుల్లోకి వెళ్లి కడుపార మేసేవి. ఏ పెద్ద పులో సింహమో వస్తే చటుక్కున పొడుగాటి గడ్డి మొక్కల మాటున దాక్కునేవి. పొద్దుటి నుండి మధ్యాహ్నం దాక మేసేవి. మధ్యాహ్నం ఎండవేళ విశ్రమించేవి. మళ్లీ సాయంకాలం గడ్డి మేసేవి. వాటికి వినగల శక్తి, వాసన చూడగల శక్తి అంత ఎక్కువగా వుండేది కాదు. కాని ఎంత దూరమయినా చూడగలిగేవి; మెరుపులా పరుగెత్త గలిగేవి. నిశితమైన ఈ చూపూ, వేగమూ – ఇదే వాటిని ఆపదల నుండి రక్షించేవి.

ఖాగా దూరాలు పరుగెత్తడంలో నల్ల జింకను మించిన మృగం ఏదీ ప్రపంచంలో లేదు. అది గంటకు 65 కిలోమీటర్ల చొప్పున పరుగెత్త గలదు. మొదట అది ఎత్తుగా ఎగురుతుంది. నెమ్మదిగా ఆ ఎగరడంలోనే వేగం పుంజు కుంటుంది. క్రమంగా వేగం హెచ్చుతుంది. ఆ తర్వాత, గెంతూ పరుగూ కలిసి



నట్లు దూసుకు పోతూంటుంది. ఎంతో హొయలతో అలవోకగా పరుగెడుతున్న జింకల గుంపు, కన్నుల పండువుగా ఉంటుంది.

రోహంతుడు చిన్నవాడుగా వుండగా, ఒక సంఘటన జరిగింది. దాంతో అత డెంత తెలివిగలవాడో తెలిసింది.

ఆ అడవిలో ఎన్నో మామిడి చెట్లుండేవి. పక్షులు కొరకగా క్రిందపడిన మామిడి పండ్లను ఆ జింకలు తినేవి. క్రిందుగా వున్న కొమ్మల మీది పండ్ల నయితే వెనక కాళ్ల మీద నిలబడి, పైకి లేచి అందుకునేవి. ఈ అడవికి ఒక వేటగాడు వచ్చేవాడు. చెట్టు దగ్గరగా జింకల అడుగుల గుర్తులు కనబడితే చాలు, అతడు ఆ చెట్టు మీద చిన్న మంచె కట్టే వాడు; దానిని దట్టంగా ఆకులతో కప్పివేసి, దానిమీద నక్కి కూచునేవాడు. ఆ చెట్టు దగ్గరకు ఏదయినా జింక రాగానే, గురి చూసి దాని మీదకు ఈటెను విసిరి చంపేవాడు. ఆ చచ్చిన జింక చర్మాన్నీ, మాంసాన్నీ అమ్మి అతడు బ్రతుకుతుండేవాడు.





ఒకనాడు, రోహంతుడు, ఒక మామిడిచెట్టును చూశాడు. దాని కొమ్మలు బాగా క్రిందుగా వున్నాయి. ఆ కొమ్మలనిండా మామిడి పళ్ళు వేలాడుతున్నాయి. రోహంతుడికి బాగా ఆకలి వేసింది. కడుపునిండా మామిడిపళ్ళు ఆరగించాడు. ఆ చెట్టుమీద ఇంకా బోలెడు మామిడి పళ్ళున్నాయి. మళ్ళీ రేపు వద్దాములే అని వెళ్ళిపోయాడు రోహంతుడు.

అతడు వెళ్ళిపోయాక అటు వైపు ఆ వేటగాడు వచ్చాడు. అతడు రోహంతుడి అడుగుజాడలను చూశాడు. వెంటనే ఆ మామిడి చెట్టుమీద మంచెను నిర్మించి, ఇంటికి వెళ్ళాడు. మరుసటి రోజు పొద్దున్నే లేచాడు వేటగాడు. ఏదో ఇంత తిండి తిని గబ గబ అడవిలోకి వచ్చాడు. ఆ మామిడి చెట్టు ఎక్కి మంచెమీద పొంచి చూస్తున్నాడు. అతడి ప్రక్కనే పొడుగాటి ఈటె వుంది. చాలసేపు అట్లాగే చూస్తున్నాడు; కాని ఏమీ జరగలేదు. చివరకు ఒక చిన్న మగ జింక ఆ చెట్టు వైపు వస్తూండడం గమనించాడు. వేటగాడికి సంతోషం కలిగింది. ఆ వస్తున్న జింక ఇంకెవరో కాదు, రోహంతుడే.

జింక అడుగుజాడలను వేటగాడు గుర్తించినట్లే, ఆ వేటగాడి పాదాల జాడలను రోహంతుడు గమనించాడు. ఎంతో జాగ్రత్తగా నడచినప్పటికీ వేట



గాడి అడుగుజాడలు ఒకటి రెండు పడ్డాయి. అది గమనించిన రోహంతుడు తల పైకెత్తి చెట్టు వైపు చూశాడు. ఆకులు సహజంగా లేపనిపించింది, కొమ్మలూ రెమ్మలూ ఎవరో కదిలించినట్లు తోచింది. ఇదేదో అపాయం వున్నట్లుంది అనుకుని రోహంతుడు ఆ చెట్టుకు దూరంగానే ఆగిపోయాడు.

ఆ వేటగాడు, జింక దగ్గరకు రావాలని, ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు. కాని రోహంతుడు కదలలేదు. అప్పుడు వేటగాడు ఒక మామిడి పండును కోసి నేల మీదకు విసిరాడు. ఆ పండు నేలమీద పడి దొర్లుకుంటూ రోహంతుడి వైపు వెళ్ళింది. ఈ పండును చూచి మోజుపడి, ఇంకా పళ్ళు తిందామన్న ఆశతో జింక, చెట్టును సమీపిస్తుంది కదా అనుకున్నాడు వేటగాడు.

తనవైపు దొర్లి వస్తున్న మామిడి పండును చూశాడు రోహంతుడు. ఇదేదో మోసం అనుకున్నాడు. చెట్టును జాగ్రత్తగా పరిశీలించి చూశాడు. ముఖ్యంగా, నిన్నటిలాగా కాకుండా ఇంకోలా అనిపిస్తున్న వైపు గమనించాడు. మొదట ఏమీ కనపడలేదు. అదృష్టవశాత్తు ఇంతలోకే గాలి వీచింది. ఆకులు కదిలాయి. ఆ క్షణంసేపులో రోహంతుడు వేటగాడిని చూశాడు.

కాని వేటగాడిని చూసినట్లు బయటికి కనపడనివ్వలేదు రోహంతుడు; చెట్టు వైపు తిరిగి ఇట్లా అన్నాడు. "ఓ మామిడి చెట్టూ! నువ్వెంతో మంచిదానివి. ఇన్ని రోజులనుంచి నువ్వు నీ పళ్ళను తిన్నగా క్రిందికి రాల్చేదానివి. కాని ఇవాళ నువ్వు పళ్ళను రాళ్ళవలె నా మీదకు విసురుతున్నావు. అంటే నీకు నేనంటే ఇష్టం లేదన్నమాట. పోనీలే, నేనింకో చెట్టు దగ్గరకు వెళ్ళి నేస్తం కడతానులే! –"

ఈ పొగరుబోతు జింక తన్ను ఎగతాళి చేస్తూందని తెలుసుకున్న వేటగాడికి భలే కోపం వచ్చింది. చేతిలో వున్న ఈటెను జింక మీదకు విసిరాడు. కాని రోహంతుడు బాగా దూరంగా వుండడంచేత అది అతడికి తగలలేదు. ఈటె వచ్చి అతడి ముందు పడింది. ఆ వేటగాడి నింకా ఏడిపిద్దామని రోహంతుడు ఈటెను నోట కరచుకుని పారిపోయాడు.

కాని ఇంకొకసారి రోహంతుడు

అంత సులభంగా తప్పించుకోలేకపోయాడు. అతడు అడవిలో తిరుగుతుండగా ఒక బోయవాడు పన్నిన వలలో చిక్కుకున్నాడు. ఒక్కక్షణం గాభరా పడ్డాడు. అతి ప్రయత్నంమీద భయాన్ని పోగొట్టుకుని, తప్పించుకోవడం ఎట్లా అని నెమ్మదిగా ఆలోచించ సాగాడు. తాను ఇటూఅటూ కదలి, లాగి, విడివడడానికి ప్రయత్నించినకొద్దీ ఆవల ఉచ్చులు ఇంకా బిగుసుకుపోయి, తాను ఇంకా నిస్సహాయుడయిపోతానని తెలిసింది అతడికి. తన కాలిగిట్టలతో మట్టినీ గడ్డినీ తవ్వి ఇటూ అటూ విసిరాడు. తర్వాత ప్రక్కకు తిరిగి పడుకున్నాడు. కాళ్ళను వేలాడవేశాడు. కళ్ళు మూసుకున్నాడు. మెడవాల్చాడు. నాలుక వెళ్ళబెట్టాడు. చొంగ కార్చసాగాడు. అతడి దేహమంతా తడిసి బురదతోనిండి అసహ్యంగా తయారయింది. ఈగలు వచ్చి అతడి శరీరంమీద వాలాయి. కదలకుండ పడివున్న ఆ దేహం మీదకు కొన్ని కాకులు కూడా వచ్చి కూర్చున్నాయి.

అట్లా చాలాసేపు పడి యున్నాడు రోహంతుడు. వలలో ఏమయినా పడిందేమో చూద్దామనుకుని మధ్యాహ్నం అటు వచ్చాడు బోయవాడు. వలలో చిక్కుకున్న జింకను దూరంనుండి చూసి మురిసిపోయాడు. కాని, దగ్గరకు వచ్చి చూశాక అతడి సంతోషం తగ్గిపోయింది. నిశ్చలంగా వున్న జింక దేహం మీద కాకులు కూర్చొని వున్నాయి. ఈగలు ముసురుకొని వున్నాయి. చనిపోయే ముందు జింక విలవిల తన్నుకున్నట్టుగా నేలంతా త్రవ్వినట్లుంది. దగ్గరకు వచ్చి జింకను తట్టి చూశాడు. అది కదలలేదు.

"నేను చాల దురదృష్టవంతుడిని. ఈ జింక పొద్దున్నే వలలో చిక్కుకున్నట్లుంది. విలవిల తన్నుకోవడంతో ఉచ్చు మెడకు బిగుసుకుని చచ్చి



పోయింది. ఇప్పటికే చచ్చి చాల సేపయింది. ఇంటికి తీసుకు వెళ్ళేసరికి మాంసం కాస్తా చెడిపోతుందేమో.... దీని నిక్కడే కోసి కొంత మాంసం తింటాను. మిగిలిన దానిని ఇంటికి తీసుకు వెళ్తాను'' అనుకున్నాడు ఆ బోయవాడు. వలను విడిపించాడు. జింక నక్కడే పడేసి, నిప్పు రాజవెయ్యడానికి చితుకులూ పుల్లలూ ఏరుకుని వద్దామని వెళ్ళాడు. అతడటు వెళ్ళగానే రోహంతుడు లేచాడు. ఒళ్ళు విదిలించుకుని, మెడ సవరించుకుని రివ్వున బాణంలా దూసుకుని పారిపోయాడు.

పెరిగి పెద్దవాడవుతున్న కొద్దీ ఇట్లాటి సంఘటనలు ఎన్నో ఎదుర్కున్నాడు రోహంతుడు. జీవితం ఎంత సంతోషమయమో అంత అపాయకరం కూడానని అతడు తెలుసుకున్నాడు. అపాయాలలో చిక్కుకున్నప్పుడు సాయపడడానికి స్నేహితులుండాలి. ఆ స్నేహితుల కేదయినా ఆపద వస్తే ఆదుకోవాలి.

ఆ అడవిలో రోహంతుడు వుంటున్న చోట గడ్డి ఏపుగా పెరుగుతుండేది. ఆ చోటికి దగ్గరగా ఒక ఎత్తయిన చెట్టుండేది. ఆ చెట్టు మీద ఒక వడ్రంగి పిట్ట, చెట్టుకు సమీపములో వున్న గుంటలో ఒక తాబేలు ఉండేవి.

కొంత దూరంలో ఒక పెద్ద చెరువు ఉండేది. జింకలన్నీ సాయంకాలం



నీళ్ళు త్రాగడానికని ఆ చెరువు దగ్గరకు వచ్చేవి. కాని రోహంతుడు మాత్రం నీళ్ళు తాగడానికి గుంట దగ్గరకు వెళ్ళేవాడు. అక్కడయితే ఇంచక్కా తాబేలుతో, వడ్రంగి పిట్టతో కబుర్లు చెప్పుకోవచ్చని అతడు గుంట దగ్గరకు వెళ్ళేవాడు. ఆ ముగ్గురూ బాగా స్నేహితులయ్యారు.

ఒక రోజు ఒక వేటగాడు అటు వైపు వచ్చాడు. ఆ గుంట వున్న వైపు రోహంతుడి అడుగు జాడలుండడం గమనించాడు. కొన్ని వారాల ముందుగా ఆ వేటగాడు అటు వచ్చినప్పుడు అటువంటి జాడలేమీ లేవు. కాని ఇప్పుడున్నాయి. కనుక ఇప్పుడు రోజూ ఒక జింక వస్తున్నదని అతడికి తెలిసింది. దానిని పట్టుకోవాలని అతను తోలుతో ఉచ్చుపన్ని వుంచేసి, వెళ్ళిపోయాడు. నీటి అడుగున వున్న తాబేలు, వేటగాడు ఉచ్చు పన్నడం చూడలేదు.

ఆ సాయంత్రం రోహంతుడు నీళ్ళు తాగడానికని, గుంటకు వెళ్తుండగా ఆ ఉచ్చులో చిక్కుకున్నాడు. కెవ్వుమని అరిచాడు. అతడి కేకలు విని, వడ్రంగి పిట్ట ఎగిరి వచ్చి ఆ ప్రక్కనే వున్న రాతిమీద కూర్చుంది. తాబేలూ నీటిలో నుండి ఒడ్డు మీదకు వచ్చింది.





అప్పుడు వడ్రంగిపిట్ట తాబేలుతో ఇట్లా చెప్పింది: "మిత్రమా! మన నేస్తాన్ని విడిపించాలి. నీ పళ్ళు చాల గట్టివి. గనుక నీవు ఈ ఉచ్చు త్రాళ్ళను కొరికి వేయి. కాని ఈ త్రాళ్ళు గట్టిగా వుంటాయి. కనక, వాటిని కొరికి ముక్కలు చేయడానికి చాల సేపు పట్టవచ్చు; బహుశ ఒక రోజెల్లా పడు తుందేమో! ఈలోగా ఆ వేటగాడు ఇటు రాకుండా వుండడానికి నేను చేయ గల్గిందెల్లా చేస్తాను."

వడ్రంగి పిట్ట ఎగిరి వెళ్ళింది. కాస్త దూరంగా, అడవి అవతల మైదానంలో వున్న ఆ వేటగాడి గుడిసె చేరుకుంది. గుడిసె ఎదుట వున్న చెట్టు మీద ఆ రాత్రంతా గడిపింది. తెల్లవారింది. చేతిలో కత్తితో వేటగాడు బయటికి వచ్చాడు. అతడిని చూడగానే వడ్రంగిపిట్ట రివ్వున అతడి మీదకు ఎగిరింది. కీచు కీచుమని అరిచింది. అతడి మొహం మీద రెక్కలతో కొట్టింది. అతడి పైన రెట్టలు వేసింది. వేటగాడికి శకునాల మీద నమ్మకం వుండేది. పొద్దున లేచి పని మీద వెళ్ళ బోతుండగా ఇట్లా పక్షి రెట్టలు తన మీద పడడం చాల అపశకునం అని అనుకుని, పొద్దున్న బయటికి వెళ్ళకూడదని నిశ్చయించుకున్నాడు.

మధ్యాహ్నం అయ్యాక, బయలుదేరుదామనుకుని ఆ పక్షి ఇంకా వుందా, ఎగిరి పోయిందా అని బయటికి తొంగి చూశాడు వేటగాడు. అది అక్కడే వుంది. అది వేట గాడిని చూసింది. గుడిసె వెనక దారినుండి బయటపడితే ఈ పక్షి బెడద వుండదు కదా అని ఎత్తు వేశాడు వేటగాడు. కాని వడ్రంగిపిట్ట ఎంతో తెలివి గలది; వేటగాడి ఊహను పసిగట్టింది. వాడు వెనక గుమ్మం చేరేసరికి వడ్రంగిపిట్ట అక్కడకు చేరింది. వాడు బయటికి అడుగు వేయగానే అతడి మీదకు ఎగిరి, రెక్కలతో ముక్కుతో పొడిచి, రెట్టలు వేసి నానాగొడవ చేసింది. కాని ఈసారి వేట గాడికి కోపం వచ్చింది. పిట్టను చేత్తో విదిలించి కొట్టాడు.

పట్టుకుని దాని పీక నులిమేద్దామనుకున్నాడు. ఇంక వేటగాడితో పేచీపెట్టుకుంటే ప్రమాదమేనని తెలుసుకుంది వడ్రంగి పిట్ట. ఎగిరివెళ్ళి చెట్టుపైన కూర్చుని వాడేమి చేస్తాడోనని చూడసాగింది. శకునం బాగున్నా లేకున్నా ఇక ఆ గుంట దగ్గరకు వెళ్లి తీరవలసిందేనని నిశ్చయించుకుని బయలుదేరాడు వేటగాడు. ఇంక అక్కడ వుండడం. దండగ అనుకుని తన మిత్రులను హెచ్చరించేందుకు ఎగిరి వెళ్ళింది వడ్రంగి పిట్ట.

ఆ పాటికి తాబేలు ఆ ఉచ్చుకు ఉన్న త్రాళ్ళన్నిటిని కొరికివేసింది ; కాని ఒకే ఒక త్రాడు ఇంకా మిగిలి వుంది. అది చాల గట్టిగా వుంది. తాబేలు పళ్ళన్నీ ఊడి పడిపోతాయేమో నన్నట్లుగా వున్నాయి. దాని నోరంతా నెత్తురుమయం అయింది. వడ్రంగి పిట్ట వచ్చి, వేటగాడు వస్తున్నాడని చెప్పింది. దవడలు, పళ్ళు నొప్పెడుతున్నా తాబేలు ఆ మిగిలి వున్న దానిని ఇంకా గట్టిగా కొరక సాగింది. దూరంగా వస్తున్న వేటగాడిని చూడగానే రోహంతుడు శక్తి కొద్దీ లాగాడు. వేటగాడు పదడుగుల దూరాన వుండగా ఆఖరి త్రాడు తెగింది. రోహంతుడు అడవిలోకి పారిపోయాడు. వడ్రంగి పిట్ట ఎగిరిపోయి చెట్టు మీద కూర్చుంది. కాని అంతకు ముందు రాత్రంతా, ఆ పగలంతా ఆ తాళ్ళన్ని కొరికి కొరికి అలిసివున్న తాబేలు సొమ్మసిల్లి అక్కడే పడిపోయింది.



జింక తప్పించుకుని పోయినందుకు, వేటగాడికి కోపం వచ్చింది. ఆ తాబేలును ఎత్తి సంచిలో వేసుకుని ఆ సంచిని దిగువగా వున్న ఒక చెట్టు కొమ్మకు తగిలించాడు. పారిపోతూ పారిపోతూ ఇది చూశాడు రోహంతుడు; ఠక్కున ఆగిపోయాడు. తన్ను రక్షించడానికి ఇంత కష్టపడిన మిత్రుడిని అట్లా వదిలి ఎట్లా పోవడం? ఒక ఉపాయం ఆలోచించాడు. నడుస్తూ నడుస్తూ తూలిపడబోయాడు. సర్దుకుని మళ్ళీ కొంత దూరం నడిచాడు. మళ్ళీ పడబోయాడు.





ఇది గమనించాడు వేటగాడు. జింక బాగా అలిసిపోయిందని, వేగంగా పరుగెత్తలేదని అనుకున్నాడు. చేత్తో కత్తితో దానిని వెంబడించాడు. అతడికి అంటీ అందకుండా పరుగెత్తసాగాడు రోహంతుడు; నెమ్మదిగా వేటగాడిని అడవి లోపలికి తీసుకువెళ్ళాడు. బాగా దూరం వచ్చామని తెలిశాక రోహంతుడు నటనను మానివేసి ఇంకొక దారి వెంబడి దూసుకుని వెనక్కు పారిపోయాడు. అటా పరుగెత్తి తాబేలు వున్న చోటుకు చేరాడు. ఆ సంచిని తన కొమ్ములతో చించివేశాడు. ఆ పాటికి సేద దీరిన తాబేలు గబ గబ పారిపోయి, నీటి అడుగుకు చేరింది.



ఇట్లా ఎన్నో ఏళ్ళు గడిచాయి. రోహంతుడు ఆ జింకల మందలోని పెద్దవారిలో ఒకడయ్యాడు. ఆ మంద నాయకుడయిన జింక చనిపోయాక మిగతా జింకలన్నీ కలిసి రోహంతుడిని తమ నాయకుడిగా ఎన్నుకున్నాయి.

త్వరలోనే తమకు పెద్ద ఆపద రానున్నదని వాళ్ళలో ఎవరికీ తెలియదు.

ఈ జింకల గుంపు నివసిస్తున్న అడవీ, ఆ ప్రక్కనేవున్న మైదానమూ – ఇవన్నీ కాశీ రాజుగారి రాజ్యంలోనివి.

ముసలి రాజు చనిపోగానే ఆయన కొడుకు కాశీ రాజ్యానికి రాజయ్యాడు. కొత్త రాజుకు వేటాడ్డం అంటే చాల ఇష్టం. ఇందువలన జంతువులకే కాక మనుషులకూ చాల ఇబ్బంది కలిగేది. వేటాడ్డానికి వెళ్తున్న దారిలో వున్న గ్రామస్తులనూ నగరవాసులనూ అందరినీ పిలిపించేవాడు రాజు. తన వెంట వచ్చి వాళ్ళందరూ డప్పులూ అవీ మోగించి, పొదలన్నిటిని పొడిచి, కొట్టి జింకలను బయటికి వచ్చేటట్లు చేయమని ఆజ్ఞాపించేవాడు. అట్లా బయటికి వచ్చిన జింకలను బాణాలు వేసి ఆ రాజు చంపేవాడు. అందుచేత ఆ రాజు వేటకు బయలుదేరితే చాలు, ప్రజలకు వాళ్ళ వాళ్ళ పనులు చేసుకోవడానికి, పొట్ట పోసుకోడానికి వీలుండేది కాదు.

ఈ సమస్య నెదుర్కోవడానికి కొంత మంది పెద్దలొక చోట చేరారు. ఒక ముసలివాడు ఒక ఉపాయం చెప్పాడు. "రాజు అంతఃపురం చుట్టు విశాలమైన మైదానం వుందికదా! దాని చుట్టు కంచె కడదాం. మైదానంలో త్రవ్వి, నీటి గుంటలు ఏర్పాటు చేద్దాం. ఏపుగా గడ్డి పెంచుదాం. ఇట్లా మేతకు గడ్డి తాగడానికి నీరూ వుంటే జింకలిక్కడ వుండగలవు. అప్పుడు మనం అందరమూ

వెళ్ళి జింకలన్నిటిని తరుముకొచ్చి ఇక్కడ వదలిపెడదాం. అప్పుడింక రాజుగారు ఇక్కడే జింకలను వేటాడుతాడు, మనకు ఎటువంటి కష్టమూ వుండదు."

ఈ ఉపాయం బాగుందని అందరూ అన్నారు. వెళ్ళి రాజుగారికి చెబితే ఆయన సరేనన్నాడు. తమ కష్టాలు తీరిపోతాయికదా అని ప్రజలంతా ఉత్సాహంతో పనిచేశారు. గడ్డిని, మొక్కలను తెచ్చి నాటారు. నీటిగుంటలను ఏర్పాటుచేశారు. త్వరలో ఆమైదానం చాల చక్కటి వనంగా మారిపోయింది. అప్పుడు దాని చుట్టూరా కంచెకట్టారు. ఆ తర్వాత జనులందరూ అడవిలోకి వెళ్ళారు. అడవిని చుట్టు ముట్టారు. చెట్లను కొట్టి వేశారు. పొదలను కదిలించారు. కర్రలతో పొడిచారు. చాటుమాటుగా వున్న జింకలు బయటికి వచ్చేలా చేశారు.





అప్పుడు ఆకాశం దద్దరిల్లేలా తప్పెటలు మోగించారు, అరిచారు. ఆ రణగొణ ధ్వనులకు భయపడి ఆ జింకలు పారిపోయి అంతఃపురం చుట్టువున్న దట్టమైన తోటలోకి చేరాయి. జింకలన్నీ ఆ తోటలోకి చేరాక దారులన్నిటినీ మూసివేసి, ఆ ప్రజలు రాజు దగ్గరకు వెళ్ళారు. ఇకనుండి ఆయన చిత్తం వచ్చినప్పుడెల్లా వేటాడవచ్చునని, ఇంక వారి వారి పనులు మానుకొని తన వెంట రమ్మని జనులను ఆజ్ఞాపించనక్కరలేదని మనవి చేశారు.

అట్లా తోటకు చేరిన నల్ల జింకల గుంపులు రెండింటిలో ఒక దానికి నాయకుడు రోహంతుడు. రెండవ మందకు హిరణుడు నాయకుడు. హిరణుడు కూడా సమర్థుడైన నాయకుడే. కాని రోహంతుడు తన మందను ప్రేమతో పాలించేవాడు. హిరణుడు తన మందను భయంతో అదుపులో పెట్టేవాడు. తన వనంలోని జింకలను చూద్దామని వెళ్ళిన రాజు వీరిద్దరిని చూశాడు. చాల చక్కటి నల్లజింకలివి అనుకున్నాడు. వారిద్దరినీ మాత్రం ఎవరూ ఏమీ చేయకూడదు అని ఉత్తర్వు జారీ చేశాడు.

రాజు రోజూ వేటాడే వాడు. గురి తప్పకుండా బాణం వేయడంలో ఆయన నేర్పరి. అంచేత ఆయన తాను వేటాడే ముందుగా జింకలను సాధ్యమయినంత దూరం పారిపోనిచ్చి అప్పుడు విల్లు ఎక్కు పెట్టేవాడు. అంతే కాదు, ఒక్క జింకను చంపినాక ఆ రోజుకు వేట చాలించే వాడు.



అయినప్పటికీ రాజు కన్పించగానే తోటలోని జింకలు కళవళ పడేవి. భయంతో ఇటూ అటూ పరుగెత్తేవి. ఈ గందరగోళంలో ఎన్నో జింకలకు గాయాలు తగిలేవి. రాజుగారు ఒక జింకను చంపేలోగా, వేట ముగించేలోగా చాల జింకలకు దెబ్బలు తగిలేవి.

ఈ అనవసరపు బాధనంతా చూచిన రోహంతుడు హిరణుడితో ''స్నేహితుడా! మనం చాల దురదృష్టవంతులం. రోజూ మనలో ఒకరికి చావు తప్పదు. పుట్టినవారందరూ గిట్టక తప్పదు. మనం అడవిలో వుంటుండగా కూడా వేటగాళ్లు, బోయవాళ్ళు, క్రైసలు, పులులు, సింహాలు - ఎన్ని ఆపదలు ముంచుకొచ్చేవి మనకు! కనుక చావు ఎటూ తప్పదు. కాని ఆ చచ్చే ఒకరూ చస్తుండగా అనవసరంగా ఇతరులు చాలామంది బాధ పడవలసి వస్తోంది -'' అన్నాడు.

''నువ్వు చెప్పిందంతా నిజమే. కాని మనమేమి చేయగలం?'' అన్నాడు హిరణుడు.

''అట్లా అధైర్య పడకు... దీనికొక ఉపాయం ఆలోచించాను. మనం ప్రతి రోజూ చీట్లు వేద్దాం. ఒక చీటి తీద్దాం. దాని మీద ఎవరి పేరుందో ఆ జింక రాజుగారి వేటకు వెళ్ళాలి. ఒక రోజు నా గుంపులోని జింక వెళ్తే రెండవ రోజు నీ గుంపులోని జింక వెళ్ళాలి. ఇట్లా చేస్తే మిగతా జింకలకు కష్టం తప్పుతుంది'' అన్నాడు రోహంతుడు. హిరణుడు అంగీకరించాడు.

రాజుకు వేటంటే ఇష్టమే గాని ఆయనకు ఒక జింకను వేటాడితే చాలనిపించేది. అనవసరంగా మిగతా జింకలకు గాయాలు తగలడం ఆయనకూ ఇష్టం వుండేది కాదు. అందుచేత ఆయనా ఇందుకు ఒప్పుకున్నాడు. కాని ఆ వచ్చే ఒక జింకా తిన్నగా తన దగ్గరకు వస్తే తాను దాన్ని కసాయివాడిలా చంపడం ఆయనకు నచ్చలేదు. తోట కంచెకు అవల ఇంకొక కంచె కట్టించాడు. ఆ రెండు



కంచెల నడుమ దారి లాటిది ఏర్పడింది. ఆ దారిలో ఒక గుర్తుంచాడు. అక్కడ నుండి వేట మొదలవుతుందన్న మాట. తోట లోపలి నుంచి ఆ దారికి రావడానికని లోపలి కంచె మధ్య ఒక ద్వారం ఏర్పరచాడు. ఏ జింకయితే వేటకు రావాలో అది ఆ ద్వారం గుండా బయటికి వచ్చేది. గుర్తించిన చోట రాజు పొంచి వుండేవాడు. ఆ వచ్చిన జింక బాగా దూరం వెళ్ళాక, రాజు వెంటాడే వాడు. వెంటాడి బాణం వేసి ఆ జింకను చంపేవాడు.

ఆ వచ్చిన జింక గనుక ఒకసారి తప్పించుకుని పరుగెత్తి ఆ తోట నొకసారి చుట్టి వచ్చి బయలుదేరిన చోటికి రాగలిగితే రాజు ఆ రోజుకు దానిని చంపకుండా వదిలివేసే వాడు. మళ్ళీ ఇంకొక రోజెప్పుడయినా దాని వంతు వస్తే తప్ప ఆ జింక మళ్లీ వేటకు రానక్కర్లేదు. కాని సాధారణంగా రాజుగారి గురి తప్పేది కాదు. కనుక వంతు వచ్చిన జింక మళ్లీ బ్రతికి వెనక్కు వెళ్ళడం అన్నది జరిగేది కాదు. ఆ జింకకు ఆయువు ముగిసినట్లే.... అయినా వెనకటికి ఒక జింక చస్తే అయిదారింటికి అనవసరంగా గాయాలు తగిలేవి. కాని ఇప్పుడా బెడద లేదు.

ఒక రోజు, గర్భవతిగా వున్న ఆడజింక వంతు వచ్చింది. "అయ్యో! ఇవాళ నేను వేటకు వెళ్లితే, చనిపోతాను; అప్పుడిక నా బిడ్డ పుట్టడానికి



పిలుండదు'' అని ఆ జింక దుఃఖపడింది. ''ఇంకా కొన్ని రోజులపాటు బ్రతికి వుండగల్గితే నా బిడ్డ పుడుతుంది. ఆ తర్వాతయితే చావటానికి నేను సిద్ధమే—'' అనుకుంది. ఈ ఆడజింక హిరణ్‌గుంపుకు చెందింది. కనుక హిరణ్‌కు తన గోడు చెప్పుకుని ఏడ్చింది. కొన్ని రోజులపాటు తన్ను వేటకు పంపవద్దని కోరింది. ఆమె బాధను హిరణుడు అర్థం చేసుకున్నాడు. ''ఇది చాల బాధాకరమే! కాని నీ వంతు వచ్చిన నాడు ఇంకొకరిని పంపలేను. ప్రతివారికి ప్రాణమంటే తీపే! ఎంత ఎక్కువకాలం వీలయితే అంత ఎక్కువకాలం బ్రతికి వుండాలని అందరికీ వుంటుంది. కనుక నీకు బదులుగా ఇంకొకరిని వెళ్లమని చెప్పడం న్యాయం కాదు'' అన్నాడు హిరణుడు.

పాపం, ఆ జింకకు నాయకుడి మాటలు నిజమేనన్పించాయి. ఇంక ఆశ అన్నీ వదలుకుంది. కాని చివరి ప్రయత్నం చేద్దామనుకుని రోహంతుడి దగ్గరకు



వెళ్ళింది. రోహంతుడేదయినా దారి చెబుతాడేమోనని వెళ్ళింది. రోహంతుడు అన్నీ విన్నాడు. హిరణుడు చెప్పేది సరేననిపించింది. ఆ ఆడజింకకు బదులుగా ఇంకొకరిని వెళ్ళమనడం సబబు కాదనిపించింది.

అయినా — "నీ బిడ్డ పుట్టేవాక నువ్వు వెళ్ళకర్లేదు —" అన్నాడు రోహంతుడు.

"మరివ్వాళ ఏమి చేస్తారు ?" అని అడిగింది ఆ ఆడజింక.

"ఏదో ఒకటి చేద్దాములే . . . నువ్వు దిగులుపడకు —" — — — ఆ రోజు వేటాడ్డానికి వచ్చిన రాజు, వేటకు రోహంతుడే వచ్చివుండడం చూసి ఆశ్చర్య పడ్డాడు.

రాజు ఇట్లా అన్నాడు. "రోహంతా ! నిన్నుగాని, హిరణుడినిగాని ఎవరూ ఏమీ చేయరాదన్న నా ఆజ్ఞ తెలుసును కదా — మరి ఈ వంతులలోకి నీ పేరు



ఎందుకు చేర్చావు ? నా ఆజ్ఞకు తిరుగులేదు. నువ్వు వెనక్కు వెళ్ళి ఇంకొక జింకను పంపు !''

రోహంతుడు రాజుకు ఆడజింక విషయమంతా చెప్పి - ''కనుక ఆ ఆడ జింకకు బదులుగా ఇవాళ ఇంకొకరిని వెళ్ళమనడం న్యాయం కాదు కద . . అంచేత ఆ పని చేయలేదు నేను. ఆ ఆడజింకకు బదులుగా నేనే వచ్చాను'' అన్నాడు.

అది విని రాజు హృదయం కరిగింది. చాలసేపు ఏమీ మాట్లాడలేక పోయాడు. తర్వాత - ''ఇవాళ వేట లేదు. నువ్వు సాయంకాలం నా వద్దకు రా . . నీతో మాట్లాడాలి'' అన్నాడు రాజు.

ఆ సాయంత్రం రోహంతుడు రాజుగారి దగ్గరకు వెళ్ళాడు.

''నిన్ను గాని ఆడజింకను గాని నేను ఏమీ చేయకూడదని నిశ్చయించు కున్నాను'' అన్నాడు రాజు.

''ఎందుకు అట్లా నిశ్చయించుకున్నారు ?'' అని రోహంతు డడిగాడు.

''ఎందుకా ? పాపం ! ఆ ఆడ జింకను గాని, నీ వంటి ఉత్తముడిని గాని చంపడం చాల క్రూరం . . .'' అన్నాడు రాజు.

''రాజా ! మీ నుండి ఆ పాటి దయకు అన్ని జింకలూ నోచుకోలేదా ?'' అని అడిగాడు రోహంతుడు.

కొంత సేపు ఆలోచించాడు రాజు. ఒక గొప్ప నిర్ణయం తీసుకున్నాడు. ''నేనివ్వాళ నుండి జింకలను వేటాడ్డం మానేస్తున్నాను. ఇక నుండి నా తోట జంతువులన్నిటికి రక్షిత స్థానం అవుతుంది. నా రాజ్యంలోని అడవులలో గాని, మైదానాలలో గాని - రైతుల పొలాలలోని పైర్లను నాశనం చేస్తే తప్ప జింకలను ఎవరూ ఏమీ చేయరాదు'' అన్నాడు రాజు.

ఆ విధంగా పూర్వపు రోజులలో భారత దేశమంతటా ''అభయారణ్యాల''ను నెలకొల్పారు. ఆ అరణ్యాలలోని జంతువులు భయం లేకుండా వుండాలని వాటిని ఏర్పరచారు.

కాని కాలం గడిచిన కొద్దీ, మనం, ఆ కరుణ నిండిన సంప్రదాయాన్ని మరిచిపోయాము ; జంతువుల పట్ల దయ, దాక్షిణ్యం మరిచిపోయాము. వాటిని వేటాడి చంపడం మొదలుపెట్టాము. అన్నిటికన్న ఎక్కువగా వేటాడి వందల కొలదీ చంపినవి నల్ల జింకలే. అయితే మళ్ళీ మన క్రౌర్యపు దుష్ఫలితాలను తెలుసుకున్నాము. అందుచేత ఇప్పుడు మనదేశంలో నల్లజింకను వేటాడ రాదని శాసించారు. అంటే నల్లజింక 'రక్షిత జంతువు' అన్నమాట.

# నందియుడు – కోతులరాజు

అనగా అనగా మధ్యప్రదేశంలోని అడవులలో ఒక కోతుల గుంపు వుంటుండేది. ఆ గుంపులో ఒక పిల్లకోతి పుట్టింది. అతడి తల్లిదండ్రులు అతడికి నందియుడు- అని పేరు పెట్టారు.

నందియుడు పెరిగి చాల దయగలవాడిగా అయ్యాడు. అతడిలో సాహసం పాలు కూడా ఎక్కువే. ఒంటరిగా అడవి అంతా తిరిగి వచ్చేవాడు. ఇంకా పెద్ద వాడయ్యేదాక అట్లా ఒంటరిగా వెళ్ళరాదనీ, మిగతా గుంపుతో కలిసే వుండాలనీ లేకపోతే ఏదయినా అపాయం ఎదురవగలదనీ నందియుడి తల్లిదండ్రులు అతడికి హితవు చెప్పారు. ఆ మాటలు విన్న కొన్ని రోజులదాక నందియుడు ఆ విధం గానే నడుచుకునే వాడు. ఆ తర్వాత అతడిలో కుతూహలమూ, సాహసమూ



పెల్లుబికి వచ్చేవి. గుంపునంతటినీ వదలి ఒంటరిగా తిరిగి తిరిగి సాయంకాలానికి వచ్చి అందరిని చేరుకునేవాడు.

ఒకసారి అట్లాగే నందియుడు చెట్టుమీద నుంచి చెట్టుకు గెంతి వెళ్తూ, చాల దూరం వెళ్ళి, అడవి చివరకు చేరాడు. అడవి అంచున ఒక వాగు ఉండడం చూశాడు. ఆ వాగు మధ్యగా ఒక ద్వీపం ఉంది. ఆ ద్వీపమంతటా పండ్లు నిండిన మామిడి చెట్లుండడం చూసి అతను చాల సంతోషించాడు.



ఆ ద్వీపంలోకి వెళ్ళాలనుకున్నాడు. కాని ఆ వాగు బాగా వెడల్పుగా వుంది. ఆ వాగులో బొత్తిగా నీరు లేకుండా వుండినా నందియుడి వంటి బలం గల చిన్న కోతి కనీసం రెండు గెంతులయినా గెంతనిదే దానిని దాటలేదు. కాని అప్పుడే పడిన వర్షాల మూలంగా ఆ వాగు వరదలో వుంది; పొంగి పొర్లి వడిగా ప్రవహిస్తూంది.

నిరాశతో వెనక్కు వెళ్దామని బయలు దేరిన నందియుడి కంటికి, హఠాత్తుగా — ఆ వాగుకు నట్టనడుమగా, ఒడ్డుకూ ఆ ద్వీపానికి మధ్యగా నీటి మీద ఏదో నల్లగా కన్పడింది. పరిశీలించి చూశాడు నందియుడు. అది పెద్ద నల్లటి బండరాయి. దాని చుట్టూ నీరు సుడులు తిరుగుతూ నురుగులు కక్కుతూ వెళ్తూంది. ఆ రాతి కొసమాత్రమే నీటిమీదుగా కనపడుతూంది.



కాని ఈ ఒడ్డునుండి ఒక్క గెంతు గెంతి పాదాన్నిమోపి, ద్వీపంలోకి వెళ్ళ డానికి రెండవ గెంతడానికి కావలసినంత చోటు మాత్రం ఆ రాతిమీద వుందని పించింది నందియుడికి. అది ప్రమాద భరితంగానే వుంది. కాని నందియుడి వంటి ధైర్యశాలికి అడ్డేమిటి? అతడు గెంతి వెళ్ళి ద్వీపం చేరాడు.

అహో, ఎంత తియ్యని మామిడిపండ్లు! అతడు అంత రుచికరమైన పండ్లను అంతవరకు ఎన్నడూ తిని వుండలేదు? ఆ ద్వీపం నిండా ఎన్ని పండ్లో, ఎన్ని పండ్లో!! కడుపునిండా వాటిని అరగించాడు నందియుడు. తిరిగి ఇంటికి వెళ్దామని బయలుదేరబోయేసరికి పొట్టబరువయింది. గెంతలేక పోయాడు. ఓ గంటయ్యాక, కాస్త కడుపుబరువు తగ్గింది. నందియుడు గెంతగలిగాడు.



అప్పటికి గెంతడములో ఆ రాయి అందక కొద్దిగా ఇవతల నీళ్ళల్లో కొట్టుకులాడి ఆ రాతి అంచును పట్టుకుని పైకెగబాకి ఆ నీటివరద నుండి ప్రాణాలతో తప్పించుకుని బయట పడగలిగాడు. నెమ్మదిగా ఆ రాతిపైకి ఎగబ్రాకి కూచుని కాస్త ఊపిరి సర్దుకున్నాడు. నీళ్ళు చల్లగా వున్నాయి: నందియుడి ఒళ్ళంతా తడిసి ముద్దయింది. 'ఇంకెప్పుడూ ఇట్లా విపరీతంగా తినకూడదు. మితంగా, ఆకలితీరేటంతే తినాలి' అనుకున్నాడు నందియుడు. అలసటంతాపోయి, మధ్యాహ్నపు ఎండలో ఒళ్ళు తడి ఆరాక ఆ రాతిమీద నుండి ఎగిరి ఒడ్డుకు చేరాడు. ఎట్టకేలకు తన మందను చేరాడు.



అతడెంతో ఉత్సాహంతో, ప్రపంచంలో ఇంకెక్కడా లేనంత తియ్యని మామిడిపండ్లు లెక్కలేనన్ని వున్న ఆ ద్వీపం గురించి తన తల్లి తండ్రులకూ, స్నేహితులకూ చెప్పాడు. కాని ఉత్సాహంలో, ఆవేశంలో పిల్లలు గోరంతలు కొండంతలు చేస్తారు గనుక వాళ్ళు చెప్పేదానిని పెద్దలు అంతగా పట్టించుకోరు. మిగతావాళ్ళు కూడా నందియుడు కోతలు కోస్తున్నాడనుకున్నారు. అందరినీ ఆ ద్వీపానికి వచ్చి మామిడి పండ్లు తినమని నందియుడు చెబితే -- "వద్దు లేవోయ్! ఆ అంత అద్భుతమైన ఆ పండ్లేవో నువ్వే తిను --" అన్నారు వాళ్ళు.





సరిగ్గా ఆ పనే చేశాడు నందియుడు ఆ తర్వాతి రోజుల్లో.

మొట్టమొదటిసారి నందియుడు ఆ మామిడిపండ్ల ద్వీపాన్ని కనుగొన్నప్పుడు వానాకాలం ప్రారంభమైంది. రోజులు గడిచినకొద్దీ వానలు ఎక్కువగా కురవసాగాయి. వాగులో నీటి మట్టం పైపైకి రాసాగింది. ఆ మధ్య నున్న బండరాయి నీటి పైభాగం చిన్న చిన్నదిగా అవసాగింది. నందియుడు ఇదంతా జాగ్రత్తగా గమనించాడు. ఆ రాయి పై భాగాన్ని అతిజాగ్రత్తగా చూస్తూండాలని తెలుసుకున్నాడు. ఆ రాయి పైభాగం పూర్తిగా కనపడకుండా మాయమయి పోయిననాడు ఇంక ఆ ద్వీపంలోకి వెళ్ళడానికి వీలుపడదు. వరద తగ్గి, నీటి మట్టం తగ్గి, రాయి మళ్ళీ కనపడడానికి ఇంకా కొన్ని వారాలు పట్టవచ్చును.

ఆ వాగుకు కాస్త ఎగువగా వంపు దగ్గర నీటిలో ఒక పెద్ద మొసలి వుంటుండేది. ఆ మొసలి తానున్న చోటునుండే — రోజూ మధ్యాహ్నానికి ముందుగా నందియుడు ద్వీపం వైపుకు గెంతి వెళ్ళడమూ, సాయంకాలం అవగానే వెనక్కు గెంతి వెళ్ళడమూ గమనించింది. ఆ మొసలికి కోతి మాంసం అంటే చాల ఇష్టం. కనుక ఎట్లాగైనా నందియుడిని చంపి తినేయాలి — అనుకుంది. నందియుడు ఆ కోతిని చూడలేదు. మొసలి కూడ దాగుకునే వుంది. ఆ కోతిపిల్ల గనుక తన్ను చూస్తే భయపడి ఇంక అటువైపు రావడం మానేస్తుందేమోనని అనుకుంది మొసలి.



వాగులో నీటిమట్టం హెచ్చసాగింది. ఒకనాడు నందియుడు ఒడ్డు చేరేసరికి, నురుగులు కక్కుతున్న నీటికి పైగా ఆ రాయికొస, చాల కొద్దిగానే కనపడింది. గెంతడమా వద్దా అని తటపటాయించాడు. కాని ఇదివరలో ఎన్నోసార్లు గెంతి గెంతి వున్నాడు గనుక రాయి అంత కొద్దిగా కనపడినా దానిమీదకు గెంతి అక్కడనుండి ఇంకో గెంతు గెంతవచ్చునని అనుకున్నాడు. ఇదే తన చివరిరోజు; మళ్ళీ వానలు ఆగి వరద తగ్గి, నీరు తగ్గేదాక ఆ ద్వీపంలోకి వెళ్ళలేడు తాను.

ద్వీపంలోకి చేరాడు నందియుడు. ఇంకా కొన్ని వారాలపాటు రాలేనుకదా అని అక్కడ ఎక్కువసేపు గడిపాడు. చీకటి పడుతూందని గ్రహించి గబ గబ ఆ ద్వీపంలో తాను రోజూ ఏచోటినుండి రాతిమీదకు గెంతుతాడో ఆ చోటికి వచ్చాడు. సూర్యుడు చెట్టు చాటుకు దిగిపోయాడు. రోజూ ఎండలో మిల మిలలాడే నీరు ఇవాళ నీడలో వుంది.



ద్వీపం నుండి గెంతబోయి నందియుడు హఠాత్తుగా ఆగాడు. ఆ నీటి మధ్యనున్న రాయి మామూలుగా కనపడలేదు. పొద్దున బాగ కొద్దిభాగమే నీటికి పైన కనపడింది. ఇప్పుడేమో వానలు ఆరంభమయ్యేటప్పటివలె పెద్దదిగా కనపడుతూంది.



ఇదేదో మోసం అని గ్రహించాడు నందియుడు. దూరంనించి, ఆ సాయం కాలపు మసక వెలుతురులో చూస్తే అది రాయిలాగే వుంది. కాని వాగులో నీటి మట్టం అంత త్వరగా తగ్గదే? తాను రోజూ ద్వీపంనుండి రాతిమీదకు గెంతేచోట వంగి అంచున చూశాడు నందియుడు. నీటిమట్టం తగ్గలేదు. కనుక ఇదేదో నీటిలోని దుష్టజంతువు తన్ను మోసగించాలనుకుంటున్నది..... అని తెలుసు కున్నాడు నందియుడు. అంచేత ఒక యుక్తి పన్నాడు.



ఆ రాతిని పిలుస్తున్నట్లున్నగా నందియుడు "ఏమోయ్, మిత్రమా! నేను వెనక్కు వచ్చాను" అన్నాడు. రాయి ఏం జవాబిస్తుంది? వెంటనే నొచ్చుకున్న స్వరంతో నందియుడు–"ఏం మిత్రమా, రాయీ! ఇవాళ నాతో మాట్లాడ వెందుచేత?" అన్నాడు. "ఓహో... ఈ కోతితో రోజూ ఈరాయి మాట్లాడుతూందన్న మాట. కనుక ఇవాళ రాతికి బదులు నేను మాట్లాడాలి!" అనుకుని మొసలి – "నేస్తం! క్షమించు నేస్తం! నేను నిద్రపోతున్నాను గనుక ఇందాక నీ మాట వినపడలేదు -" అని అరిచింది.



నందియుడికి నిజం తెలిసింది. ఆ రాయిలాగ వున్నది రాయికాదు. అది పెద్ద మొసలి. దాని దేహం చాలవరకు నీటిలో మునిగివుంది. దాని దేహంలో కొంత భాగము, తలా మాత్రం రాతి మీద వున్నాయి. ఇది చూసి నందియుడు అరిచాడు. ‘‘నువ్వు నా స్నేహితుడు రాయివి కావు. నువ్వు మొసలివి. నీకేమి కావాలి ?’’

తానెవరోనన్న విషయం బయట పడిపోయినందుకు మొసలికి కోపం వచ్చింది. ‘‘నేను నీ మాంసం తినాలి’’ అంది. అప్పుడిక నందియుడు ఎత్తుకు పై ఎత్తు వేయాలి – అనుకున్నాడు.. ఇట్లా అన్నాడు. ‘‘నీకు చిక్కడం తప్ప నాకు వేరే దారి లేదు. అంచేత నేను గెంతుతాను. నువ్వు నీ నోటిని బాగా తెరిచి వుంచితే తిన్నగా అందులోకి దూకుతాను. అప్పుడు నువ్వు నన్ను తినవచ్చు ...



ఎందుకయినా మంచిది, కళ్ళు గట్టిగా మూసుకో... పొరబాటున నేను నీ నోట్లోకి కాకుండా తల మీద దూకితినా నీ కళ్ళు రెండూ గుడ్డివి అయిపోగలవు.

ఆ తెలివి తక్కువ మొసలి అట్లాగే కళ్ళు గట్టిగా మూసుకుని, నోరు పెద్దగా తెరుచుకుంది. నందియుడికి భయం వేసింది. కాని ధైర్యాన్ని చిక్క బట్టుకుని ఒక్క దూకు దూకాడు; ఆ మొసలి నోరు దాటి, రాయిలాటి దాని వీపు మీద పాదం మోపి, అది ఆధారంగా రెండవ గెంతు గెంతి వెళ్ళి ఒడ్డుచేరి గబ గబ చెట్టెక్కి కూర్చున్నాడు నందియుడు; అప్పుడు ఎగతాళిగా అన్నాడు - "ఇవాళ నీ వాత పడాలని లేదు.. మూర్ఖుడా! ఈ పూటకు, పాపం, నీ తోకనే తిన కూడదూ?"



ఇట్లా ఎన్నో సంవత్సరాలు గడిచాయి. ఆ కోతుల గుంపు నాయకుడు చనిపోయాడు. అప్పుడు ఆ కోతులు నందియుడిని తమ నాయకుడిగా ఎన్ను కున్నాయి.

ఆ గుంపు వుంటున్నచోట పండ్ల చెట్లు ఎక్కువగా లేవు. అందుచేత నందియుడు – అందరూ కలిసి ఆ మామిడి చెట్లున్న ద్వీపానికి తరలిపోదాం – అని సూచించాడు. పెద్ద కోతులకి ఆ ద్వీపం నందియుడు చెప్పినంత బాగా వుంటుంది అని నమ్మకం కుదరలేదు. కాని చిన్న వాటికి మాత్రం నందియుడి సలహా బాగా నచ్చింది.

ఆ కోతుల గుంపు మామిడి చెట్ల ద్వీపానికి తరలి వెళ్ళే సమయానికి, వేసవి కాలం మొదలయింది. అందువల్ల కోతులకు మేలు జరిగింది. ఆ వాగు ఎండి పోయింది. నీరు కొద్దిగా వుంది. ఆ నీటి మట్టానికి పైగా ఎన్నో రాళ్ళు కనుపించాయి. చిన్న చిన్న కోతులు కూడా రాతిమీద నుంచి రాతికి సులభంగా గెంతి, వాగును దాటగలిగాయి. ఆ ద్వీపం చేరాక, మొదట సందేహించిన పెద్ద కోతులు కూడా అది చాల చక్కని చోటని ఒప్పుకున్నాయి.



కొంత కాలానికి వాళ్ళకో పెద్ద సమస్య వచ్చిపడింది. ఎండలు ముదర సాగాయి. గొంతులు ఎండిపోసాగాయి. మాటిమాటికి వాగు దగ్గరకు వెళ్ళి నీరు తాగవలసి వచ్చేది. కాని వాగులో నీరు కూడ క్రమంగా ఇంకిపోసాగింది. ఒక్క ప్రవాహంలాగా వున్న ఆ వాగు చిన్నచిన్న గుంటలయింది. ఆ గుంటలలో నీరు మురికిగా, బురదగా వుండేది. ఇంకొన్నాళ్ళకు ఆ గుంటలు కూడా ఎండి పోసాగాయి. అసలు నీరన్నదే లేని పరిస్థితి ఏర్పడ్డాక ఆ కోతులు, ఆ వాగుకు దిగువను నీళ్ళేమయినా వున్నాయేమో చూద్దామని వెతకసాగాయి. ఒక మలుపు దగ్గర పెద్ద నీటిగుంట కనపడింది. ఆ గుంటలో నీరు కూడా చాలా వుంది.



ఆ నీటిని చూసి చిన్న కోతులు చాల సంతోషంతో వెళ్ళి, త్రాగబోయాయి. ఇంతలో ఒక కోతి "ఆగండి!" అని అరిచింది. ఎందుకని అడిగాయి మిగతా కోతులన్నీ . . . ఆ అరిచిన కోతి ఏమీ మాట్లాడకుండా ఆ గుంట చుట్టువున్న తడి మట్టిలో ఒక వైపును చూపించింది. ఆ మట్టిలో కుందేళ్ళు, ముళ్ళపందులు మొదలైన చిన్న చిన్న జంతువుల అడుగుజాడలు కన్పించాయి. ఆ జాడలన్నీ నీటి గుంట వైపు వస్తున్నవిగానే వున్నాయి; కాని నీరు తాగివెనక్కు వెళ్తున్నప్పటి గుర్తులే లేవు. ఇదేదో గొడవగా వుంది అని ఆ కోతులు వెళ్ళి విషయం అంతా నందియుడికి చెప్పాయి.

నందియుడు వచ్చాడు. ఆ అడుగు జాడలన్నీ పరిశీలించాడు. ఆ గుంటను జాగ్రత్తగా చూశాడు. ఆ గుంట వారగా చిన్న చిన్న వెదుళ్లు, దర్భగడ్డి వంటి మొక్కలు దట్టంగా పెరిగి వున్నాయి. నందియుడు అతి సూక్ష్మంగా చూసేసరికి, ఆ మొక్కల చాటున తన పాత శత్రువు మొసలి నక్కి వున్నట్లు కనపడింది.



తన ఉనికి తెలిసి పోయిందని గ్రహించింది మొసలి. ఇంక దాపరికం అనవసరం అని అది ఇట్లా అరిచింది – "మీకందరికీ ఆయుస్సు అయిపోయినట్లే. మీరు నా నోటిలో పడి చావనన్నా చావాలి, లేదా దాహానికి నీరు లేక విల విల లాడి చావాలి. ఎట్లాగయినా మీకు చావు తప్పదు. నీరు త్రాగడానికి వచ్చిన కోతులను నేను పట్టుకుంటాను. లేకపోతేనా, ఇంక రెండు నెలల తర్వాత వానలు వచ్చేదాక ఈ గుంటలో తప్ప ఇంకెక్కడా నీళ్ళుండవు గనుక దాహంతో చస్తారు."



చాలసేపటి వరకు నందియుడి కేమీ పాలు పోలేదు. ఈలోగా, ముఖ్యంగా కోతి పిల్లలన్నీ దాహంతో విల విలలాడి పోతున్నాయి. చివరకు నందియుడికి ఒక అద్భుతమయిన ఉపాయం తోచింది.

తనవారితో ఇట్లా అన్నాడు: ''ఈ మొసలి వున్న చోటికి దూరంగా ఈ గుంట గట్టున అన్ని వైపులకూ వెళ్ళండి.. పొడుగాటి మొక్కలను, పచ్చి బొంగు లనూ పీకండి.''

అతడూ ఒక పొడుగాటి మొక్కను పీకాడు. దాని పై కొనను కొరికి, బోలుగా వున్న ఆ మొక్కను నోట్లో పెట్టుకుని ఊదాడు. ఆ మొక్క కాండంలో కొంత క్రిందుగా కణుపు వుంది. నందియుడు ఇంకొక మొక్కను పీకి వూది చూశాడు. దీనికి కణుపు చాలా దూరంగా వుంది.



నందియుడు ఆ కణుపుకు ఇవతల తుంచి పారేసి ఊది చూశాడు. మధ్యలో అడ్డేమీ లేనందున గాలి అటు కొననుండి బయటికి వచ్చింది. మొసలి వున్న చోటికి దూరంగా ఇంకొక చోటికి వెళ్ళాడు నందియుడు. ఒడ్డు మీద, బాగా వెనక్కు నిల్చుని, ఆ పొడుగాటి మొక్క కొనను నీటిలో ముంచాడు; రెండవ కొనను నోటిలో వుంచుకుని పీల్చాడు. చల్లటి నీరు పైకి వచ్చింది; ఎండిపోయిన నోటిని హాయిగా తడిపింది. అప్పుడు నందియుడు మిగతా కోతులను కూడా అదే విధంగా దాహం తీర్చుకోమని చెప్పాడు.

ఇట్లా దాహం తీర్చుకుంటూ తన్ను చూసి ఎగతాళి చేస్తున్న కోతులను చూసి మొసలికి భలే కోపం వచ్చింది. కాని బాగా బలిసి, లావుగా, మొద్దుగా వున్న ఆ మొసలి చక చక కదలలేక పోయింది. అది కోతులను తరుముకుంటూ వచ్చేసరికి, కోతులు కాస్తా నీరు తాగడం ముగించి ఇట్టే చెట్ల పైకెక్కి పోయేవి. ఒకటి రెండు సార్లయితే ఆ మొసలి, కోతులు నీరు తాగుతున్న 'పుల్ల' లను పీకి, కొరికి పారేసింది. కాని కోతులు ఛెంగు ఛెంగున ఇంకొక చోటికి ఎగిరిపోయి అక్కడినుండి క్రొత్త 'పుల్ల' లతో నీరు తాగేవి. ఆ మొద్దుమొసలి విపరీతమయిన కోపంతో ఇటూ అటూ ఎగిరి దూకి, చివరికి అలసిపోయి ఆ గుంటలో ఒక మూల పడుకుని కోతులవైపు కొర కొర చూస్తూ వుండిపోయింది.

రెండు నెలలయ్యాక వానలు వచ్చాయి. వాగు నిండసాగింది. కనుక కోతులు మొసలి వున్న గుంటవైపు వెళ్ళకుండా, వాగు నుండి ఎక్కడ పడితే అక్కడ నీరు తాగసాగాయి.



ఆ ద్వీపంలోని మామిడి చెట్లు చాలవరకు ద్వీపం మధ్యలో వున్నాయి. కాని ఒక చెట్టు మాత్రం వాగు ఒడ్డున, మధ్య నున్న బండ రాతికి ఎదురుగా వుండేది ఆ చెట్టు కొమ్మలలో ఒకటి బాగా పొడుగ్గా నీటిమీదుగా, అవలి ఒడ్డు వైపుకు సాగివుండేది. ఆ కొమ్మ ఎండిపోయింది. కాని దాని దిగువనే క్రొత్త కొమ్మ పెరుగుతూంది. అది ఆకులతో నిండివుంది. వసంతకాలం రాగానే అది పూతతో నిండిపోయింది.

ఈ కొమ్మ మీద గనుక కాయలు కాస్తే తమ గుంపుకు మంచిది కాదను కున్నాడు నందియుడు. ఎందుకంటే కొన్ని పండ్లు రాలి, నీటిలో పడి తేలుతూ వెళ్తాయి; ఈ వాగ ఇంకే నదిలోనో కలుస్తుంది. కనుక ఈ మామిడిపండ్లు నది నీళ్ళల్లో తేలుతూ వెళ్తే, నదీ తీరాన వున్న గ్రామాలలోని, పట్నాలలోని జనులు వాటిని చూస్తారు. చూస్తే వారు తప్పకుండా బయలుదేరి ఈ ద్వీపం చేరుతారు. తమను ఇక్కడినుండి తరిమివేస్తారు.

అంచేత ఆ కొమ్మ మీద చిన్న పిందె కనపడగానే దానిని తినివేయమని నందియుడు తనవారికి చెప్పాడు. కోతులు అతడి సలహాను పాటించాయి.



కాని ఆ కొమ్మ చివర ఒక పెద్ద చీమల పుట్ట వుంది. ఆ పుట్టకు అవతల, ఆ పుట్ట చాటుగా ఒక మామిడికాయ కాచింది. అది పెరిగి పెద్దదయి పండింది. కోతులకు ఆ పండు కనపడలేదు; కనపడినా చీమలు అడ్డంగా వున్నందున అవి ఆ పండు దగ్గరకు వెళ్ళలేకపోయాయి.

బాగా పండాక ఆ పండు రాలి నీళ్ళలో పడింది; వాగువెంబడి వెళ్ళి నదిని చేరింది. నదినుండి ఆ పండు నీటిలో తేలుతూ వెళ్ళి, నది ఒడ్డునవున్న రాజుగారి అంతఃపురపు స్నానశాలలోకి వెళ్ళింది. నీటితోబాటు కొట్టుకువచ్చిన ఆ మామిడి పండును రాజు తిన్నాడు. అంత కమ్మటి, తియ్యటి మామిడిపండు నాయన అంతవరకు ఎప్పుడూ తినివుండలేదు.

ఇంత అద్భుతమైన మామిడిపండ్లు పండే తోట ఎక్కడవుందో కనుక్కోనిదే నిద్ర పోరాదనుకున్నాడు రాజు.



ఆయన విలుకాండ్రతోబాటు నావపై బయలుదేరాడు. నావ నదిలో ఎగువకు ప్రయాణంచేసి, వాగు కలిసేచోటికి చేరింది. ఆ వాగు ఒడ్డున చూద్దామని బయలుదేరారు వాళ్ళు. ఎట్టకేలకు మామిడిచెట్లున్న ద్వీపాన్ని చేరుకున్నారు.

ఆ ద్వీపంనిండా కోతులుండడం గమనించాడు రాజు. వాటన్నిటినీ వేటాడి, తరిమివేద్దాం అనుకున్నాడు. కాని ఆ పాటికే చీకటిపడుతూంది. అంచేత ఆయన తన విలుకాండ్రతో "ఎక్కువగా పండ్లున్న చెట్లన్నిటిని కాపలా కాయండి. రాత్రివేళ కోతులు పండ్లు దొంగలించకుండా చూడండి. రేపు పొద్దుపొడవగానే వాటన్నిటినీ తరిమివేద్దాం -" అన్నాడు.

చెట్లమీద ఆకుల చాటుగా దాగుకుని రాజుగారి ఆజ్ఞను విన్న ఒక చిన్న కోతి చప్పుడుచేయకుండా చెట్లపైనుండి గెంతుకుంటూ, ఆ ద్వీపంలో ఒక మూల నందియుడు విశ్రమిస్తున్న చోటికి వెళ్లింది. తాను విన్నదంతా చెప్పి, నిస్పృహతో - "ఇంక మనమేమి చేయగలం ? రేపు మనందరినీ ఇక్కడనుండి తరిమివేస్తారు. కొంతమందికి గాయాలు తగలవచ్చు. కొందరి ప్రాణాలే పోవచ్చు. ఏమి చేయాలి ? ఎక్కడికి పోదాం" అని ఏడ్చింది.

నందియుడు కాస్సేపు ఆలోచించాక ఇట్లా అన్నాడు : "దారి లేకపోలేదులే. నువ్వు వెళ్లి అందరినీ ఇంకొక గంటలో ద్వీపం ఒడ్డున, ఎండిపోయిన కొమ్మలున్న చెట్టుదగ్గర చేరమని చెప్పు."



ఆ పాటికే వానలు బాగా కురుస్తున్నందువల్ల వాగు వరదలో వుంది. ఆవలి ఒడ్డుకు చేరే నిమిత్తం గెంతడానికి కోతులకు ఆధారంగా వాగు మధ్య వున్న బండరాయి ఇప్పుడు పూర్తిగా నీటిలో మునిగిపోయి వుంది. కనుక తప్పించుకు పారిపోవడానికి కూడా దారిలేదు. నందియుడు ఎదురుదిశలో వెళ్ళాడు. అక్కడ ఒంటరిగా వున్న చెట్టు మీదికి చేరాడు. వాగుమీదుగా ఆవలి ఒడ్డుకు సాగివున్న ఎండు కొమ్మమీద అతి జాగ్రత్తగా పాకుతూ వెళ్ళి దాని చివరకు చేరాడు. అక్కడినుండి ఆవలి ఒడ్డుకు దూరం ఎంతో అంచనా వేశాడు. గెంతితే ఆవలి ఒడ్డు చేరవచ్చునని నిర్ణయించుకున్నాడు. ఒక్క గెంతు గెంతి ఆవలి ఒడ్డు మీదున్న చెట్టు పైకి చేరాడు. తాను ఎంతదూరం గెంతిందీ అంచనా కట్టాడు. క్రిందకు దిగాడు. అక్కడ వున్న వెదురు కర్రలలో పొడుగాటి దానిని పెరికాడు. తాను ఎగిరివచ్చి చేరిన చెట్టుమీదకు ఎక్కాడు.



వెదురుకర్ర ఒక కొసను, ఆ చెట్టుకొమ్మలలో వాగుమీదుగా వంగివున్న దానికి గట్టిగా కట్టాడు. సన్నగా, నున్నగా వున్న ఆ కర్రమీది ఎగబ్రాక సాగాడు. అది చాల అపాయకరమైన పని అయినా అతిజాగ్రత్తగా నందియుడు ఆ కర్రపై కొసను అందుకున్నాడు. అప్పుడా ఆ రెండవ కొసను తన నడుముకు గట్టిగా కట్టుకున్నాడు.

అప్పుడతడా కర్రను నెమ్మదిగా అటూ ఇటూ ఊపసాగాడు. ఆ కర్ర నెమ్మది నెమ్మదిగా వాగుమీదికి, విల్లువలె వంగసాగింది. వంగి వంగి, ద్వీపంలో ఎండిపోయిన కొమ్మవున్న మామిడిచెట్టుకు దగ్గరగా వచ్చింది. పరిస్థితి చాల ప్రమాదభరితంగా వుంది. ఏ క్షణాన్నయినా తాను ఆ కర్రనుండి జారి వేగంగా ప్రవహిస్తున్న వాగునీటిలో పడి మునిగిపోవచ్చు నన్పించింది నందియుడికి. కాని అతడు చాల జాగ్రత్తగా కర్రతోపాటు వూగుతూ వచ్చి, ఎండిన కొమ్మదగ్గరకు రాగానే దానిని తటాలున పట్టుకున్నాడు.



అతడు, ఆ వెదురు కఱ్ఱకొసను గనుక ఎండిన చెట్టుకొమ్మకు కడితే ఈ ఒడ్డునుండి ఆ ఒడ్డుకు సన్నటి వంతెన ఏర్పడుతుంది, అనుకున్నాడు. కాని అతడి అంచనా తప్పయింది. ఆ వెదురు కఱ్ఱ ఒక అడుగు పొడవు తక్కు వయింది. ఆ ఖాళీ దూరాన్ని అతడి శరీరం పూరించింది. ఇప్పుడతడు గనుక తన నడుముకు కట్టివున్న ముడిని కొరికి తెంపివేస్తే వెదురు కఱ్ఱ ఎగిరి వెనక్కు, అవలి ఒడ్డుకు వెళ్ళిపోతుంది. మళ్ళీ వెనక్కు అవలి ఒడ్డుకు వెళ్లి ఇంకా పొడుగాటి కఱ్ఱను వెతికి, చెట్టుకు కట్టి – అన్నీ మరల చేయడమా అని అలో చించాడు. ఈలోగా పెద్ద కోలాహలం వినపడింది. వేటగాండ్రు పొద్దు పొడిచే దాక కాచుకోవడం ఎందుకని కోతులను వేటాడ్డం మొదలుపెట్టారు. ఇంక, తన శరీరాన్ని వంతెనలో ఒక భాగంగా వుంచడం తప్ప మరొకదారి లేదని తెలుసుకున్నాడు నందియుడు.



ఆ చెట్టుక్రింద చేరివున్న కోతులకు, చెట్టెక్కి అవలి ఒడ్డుకు చేరమని నెమ్మదిగా చెప్పాడతడు. ఎన్నో కోతులున్నాయి. అవన్నీ అతడిమీదుగా, కర్ర వంతెన మీదుగా అవలి ఒడ్డుకు చేరడం మొదలుపెట్టాయి. నందియుడు ముసలి వాడు; అతడి గుండె చాల బలహీనంగా వుంది. కొంత సేపటికి అతడు బాగా అలిసి పోయాడు. ఉన్నట్లుండి అతడి గుండెలో విపరీతమైన పోటు వచ్చింది. ఇంక ఇప్పుడు గనుక ఎవరయినా తనమీద పాదం మోపితే తాను చావడం తథ్యం. ఇంకా ఒక తల్లికోతి, దాని ఇద్దరు పిల్లలు వున్నారు. ఆ పిల్లకోతులు రెండూ భయంతో తల్లిని గట్టిగా పట్టుకుని వున్నాయి. నందియుడు పళ్లు బిగించాడు. తన బాధనేమాత్రం బయటకు కనపడనివ్వకుండా, ఆ తల్లిని త్వరగా వెళ్ళమని చెప్పాడు.

ఆ తల్లి కోతి అవలి ఒడ్డు చేరిందో లేదో ప్రమాదం ముంచుకొచ్చింది. అవలి ఒడ్డున చెట్టుకు వెదురు కర్రను కట్టివుంచిన తాడుముళ్ళు, కోతుల బరువుకు తెగుతూ వచ్చి, ఇప్పుడు తక్కున పూర్తిగా తెగిపోయాయి. ఆ ఊపుకు, అసలే అలిసి మూర్ఛిల్లడానికి సిద్ధంగావున్న నందియుడు అదిరి, పట్టు జారి నేల మీదకు పడ్డాడు.

అంతకు ముందు, చాలసేపు క్రితమే రాజు వచ్చి చెట్టు చాటున నిల్చుని ఇదంతా గమనించాడు. మసక మసకగా వున్న వెన్నెలలో అతడికి కోతులు ద్వీపాన్ని వదలి వెళ్లిపోతూండడం మాత్రమే కనపడింది. తనకు కావలసిందీ అదే గనుక చూస్తూ వూరుకున్నాడు. కాని నడుముకు కట్టిన కర్రతో సహా నందియుడు క్రిందకు పడడం చూడగానే రాజుకు, ఏమి జరిగిందో బోధపడింది. పరుగెత్తుకు వెళ్లి నందియుడికి ఉపచారాలు చేశాడు. కాని నందియుడికి ఆఖరి ఘడియలు సమీపించాయని రాజు తెలుసుకున్నాడు. "అహా! నువ్వెంత ఉదారుడివి! మనుష్యులలో కూడ నీవలె ఇతరుల కోసం ప్రాణ త్యాగం చేసిన వారిని నేను చూడలేదు; అట్లాంటి వారి గురించి వినలేదు. నీ ఆఖరి కోరిక ఏదయినావుంటే చెప్పు. నేను దానిని తీరుస్తాను" అన్నాడు రాజు నందియుడితో.

చాల బలహీనమైన స్వరంతో జవాబిచ్చాడు నందియుడు: "నా గుంపులోని కోతులు నా ప్రాణానికన్న ఎక్కువ ప్రియమైనవి. వాటినేమీ చేయకండి-" అన్నాడు; అని కన్ను మూశాడు.

రాజు మనసు కరిగింది. ఈ ద్వీపాన్ని తాను ఆక్రమించుకోకూడదని, కోతులకే మళ్లీ అప్పజెప్పాలని నిర్ణయించుకున్నాడు. తెల్లవారాక అతడు

తన సైనికులను వెదురు కర్రలతో ఈ ద్వీపానికి అవలి ఒడ్డుకూ మధ్య ఒక గట్టి వంతెనను నిర్మించమన్నాడు. అవతలి వైపు నుండి కోతులు ఇవన్నీ చూస్తూన్నాయి గాని రాజుగారి మీద నమ్మకం కుదరక, వంతెన మీదుగా ద్వీపం లోకి రావడానికి తటపటాయించాయి. కాని రాజు నందియుడి శరీరానికి అంత్య క్రియలు జరుపడానికి సన్నాహాలు చేస్తూండడం చూసి, అవి రాజు నందియుడి మరణానికి తమ వలెనే గాఢంగా దుఃఖిస్తున్నాడని తెలుసుకున్నాయి. కనుక వంతెనమీదుగా ద్వీపాన్ని చేరి తమ నాయకుడి పట్ల తమకున్న భక్తి శ్రద్ధలు ప్రకటించాయి.

దహన క్రియలు ముగిశాక రాజు ఆ ద్వీపం మీద నందియుడి స్మారక నిమిత్తం ఒక స్తంభాన్ని నిర్మించాడు. ఆ స్తంభం దిగువ ఫలకం మీద ఆ రాజు— ఆ ద్వీపంలోకి మనుష్యులు ఎవరూ రాకూడదనీ, అది ఆ కోతుల గుంపులు నిశ్చింతగా నిర్భయంగా జీవించడానికని ప్రత్యేకించబడిందనీ రాయించాడు.

రాజు ఆ తోట నుండి తనతో బాటు కొన్ని మామిడిపండ్లను తీసుకు వెళ్ళాడు. వాటి టెంకలను తన అంతఃపురపు తోటలో నాటాలని తీసుకువెళ్లాడు. వాటి నుండి మొక్కలు పుట్టి పెరుగుతాయి. ఆ చెట్ల యొక్క తియ్యని మామిడి పండ్లు తిన్నప్పుడెల్లా త్యాగమూర్తి అయిన నందియుడు గుర్తుకొస్తుంటాడు అని అనుకున్నాడు రాజు.



